# అథ ఏకవింశోऽధ్యాయః

# మహేశావతారము

నందీశ్వర ఉవాచ |

అథ ప్రీత్యా శృణు మునేऽవతారం పరమం ప్రభోః | శంకరస్యాత్మభూపుత్ర శృణ్వతాం సర్వకామదమ్ || 1

ఏకదా మునిశార్దూల గిరిజాశంకరావుభౌ | విహర్తుకామౌ సంజాతౌ స్వేచ్ఛయా పరమేశ్వరౌ || 2

భైరవం ద్వారపాలం చ కృత్వాభ్యం తరమాగతౌ | నానాసఖిగణైః ప్రీత్యా సేవితౌ నరశీలితౌ || 3

చిరం విహృత్య తత్ర ద్వౌ స్వతంత్రౌ పరమేశ్వరౌ | బభూవతుః ప్రసన్నౌ తౌ నానాలీలాకరౌ మునే || 4

అథోన్మత్తాకృతిర్దేవీ స్వతంత్రా లీలయా శివా | ఆగతా ద్వారి తద్రూపా ప్రభోరాజ్ఞామవాప సా || 5

తాం దేవీం భైరవస్సోऽథ నారీదృష్ట్యా విలోక్య చ | నిషిషేధ బహిర్గంతుం తద్రూపేణ విమోహితః || 6

నారీదృష్ట్యా సుదృష్టా సాభైరవేణ యదా మునే | క్రుద్ధా భవచ్ఛివా దేవీ తం శశాప తదాంబికా || 7

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ మునీ! బ్రహ్మపుత్రా! ఇపుడు పరమప్రభుడగు శంకరుని మరియొక అవతారమును గురించి వినుము. ఇది వినువారికి కోర్కెల నన్నిటినీ ఈడేర్చును (1). ఓ మహర్షీ! పరమేశ్వరులగు గిరిజాశంకరులిద్దరు ఒకప్పుడు యథేచ్ఛగా విహరించవలెనని నిశ్చయించుకొనిరి (2). అనేకమంది సఖురాండ్రచే సేవింపబడే వారిద్దరు లోకాచారము ననుసరించి భైరవుని ద్వారపాలకునిగా నుంచి లోపలకు వెళ్లిరి (3). ఓ మహర్షీ! స్వతంత్రులు,

పరమేశ్వరులు, వివిధలీలలను ప్రకటించువారు నగు వారిద్దరు ప్రసన్నమగు మనస్సు గలవారై చిరకాలము విహరించిరి (4). తరువాత పార్వతీదేవి అతి సుందరరూపమును దాల్చి ప్రభువు యొక్క ఆజ్ఞను పొంది లీలను ప్రకటించుటలో స్వతంత్రురాలై ద్వారము వద్దకు వచ్చెను (5). భైరవుడు అపుడా దేవిని గాంచి ఆమెయొక్క రూపముచే వ్యామోహితుడై ఆమెను సామాన్యస్త్రీ యను దృష్టితో పరికించి బయటకు వెళ్లుటకు అడ్డగించెను (6). ఓ మహర్షీ! భైరవుడు ఆమెను సామాన్యస్త్రీ యను భావముతో పరికించుటను గాంచి జగన్మాతయగు పార్వతీదేవి మిక్కిలి కోపించి ఆతనిని శపించెను (7).

శివోవాచ |

నారీ దృష్ట్యా పశ్యసి త్వం యతో మాం పురుషాధమ | అతో భవ ధరాయాం హి మానుషస్త్వం చ భైరవ || 8

పార్వతి ఇట్లు పలికెను-

ఓయీ పురుషాధమా ! నీవు నన్ను స్త్రీయను దృష్టితో గాంచితివి. భైరవా! ఈ కారణముచే నీవు భూమియందు మానవుడవై జన్మించుము (8).

నందీశ్వర ఉవాచ |

ఇత్థం యదాభవచ్ఛ ప్తో భైరవశ్శివయా మునే | హాహాకారో మహానాసీద్దుఃఖమాప స లీలయా || 9

తతశ్చ శంకరశ్శీఘ్రం తమా గత్య మునీశ్వర | ఆశ్వాసయద్భైరవం హి నానా %నునయకోవిదః || 10

తచ్ఛాపాద్భైరవస్సో%థ క్షితావవతరన్మునే | మనుష్యయోన్యాం వైతాల సంజ్ఞక శ్శంకరేచ్ఛయా || 11

తత్ స్నేహతశ్శివస్సో%పి క్షితావవతద్విభుః | శివయా సహ సల్లీలో లౌకికీం గతి మాశ్రితః || 12

మహేశాహ్వశ్శివశ్చా సీ చ్చారదా గిరిజా మునే | సులీలాం చక్రతుః ప్రీత్యా నానాలీలా విశారదౌ || 13

ఇతి తే కథితం తాత మహేశచరితం వరమ్ | ధన్యం యశస్యమాయుష్యం సర్వకామఫలప్రదమ్ || 14

య ఇదం శృణుయాద్భక్త్యా శ్రావయేద్వా సమాహితః | స భుక్త్వేహాఖిలాన్ భోగానంతే మోక్షమవాప్నుయాత్ || 15

ఇతి శ్రీశివమహాపురాణ శతరుద్రసంహితాయాం మహేశావ తార వర్ణనం నామ ఏక వింశో%ధ్యాయః (20).

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ మహర్షీ ! పార్వతి భైరవుని ఇట్లు శపించగా, పెద్ద హాహాకారము చెలరేగను. ఆతడు లీలచే దుఃఖమును పొందెను (9). ఓ మహర్షీ! అపుడు వివిధ పద్ధతులలో అనునయించుట యందు నిపుణుడగు శంకరుడు శీఘ్రమే అచటకు వచ్చి ఆ భైరవుని ఓదార్చెను (10). ఓ మహర్షీ ! తరువాత శంకరుని ఇచ్ఛచే భైరవుడు ఆ శాపము వలన భూమియందు వైతాలుడను పేరుతో మానవుడై అవతరించెను (11), ఆతని యందలి ప్రేమచే, శివవిభుడు గూడ పార్వతితో గూడి భూమిపై అవతరించి లోకపు పోకడననుసరించి ఉత్తమమగు లీలలను ప్రకటించెను (12) ఓమునీ! శివుడు మహేశుడను పేరుతో, పార్వతి శారదయను పేరుతో అవతరించిరి. అనేక లీలలను ప్రకటించుటలో దక్షులగు వారిద్దరు ప్రీతితో చక్కటి లీలను నెరపిరి (13). వత్సా! నేను నీకింతవరకు శ్రేష్ఠము, ధన్యము, యశస్యము, ఆయుష్యము, సర్వకామములను ఫలములను ఇచ్చునది అగు మహేశచరిత్రను చెప్పియుంటిని (14). ఎవడైతే దీనిని భక్తితో వినునో, లేక ఏకాగ్రమగు మనస్సుతో వినిపించునో, వాడు ఈ లోకములో సకలభోగముల ననుభవించి, మరణించిన తరువాత మోక్షమును పొందును (15).

శ్రీ శివమహాపురాణములో శతరుద్రసంహితయందు మహేశావతార వర్ణనమనే ఇరువది ఒకటవ అధ్యాయము ముగిసినది (21).